

# మోక్షమార్గము


రచయిత :

శ్రీ విద్యాప్రకాశానంద గిరిస్వాములవారు


ఈ గ్రంథము గుంటూరుజిల్లా నరసరావుపేట తాలూకా
అనంతవరం గ్రామకాపురస్థులు కీర్తిశేషులైన కంచా
రోశయ్యగారి జ్ఞాపకార్థము వారి కుమారుల
ద్రవ్యసహాయముచే ముద్రింపబడి
శ్రీ కాళహస్తి యందలి శ్రీ శుకబ్రహ్మాశ్రమమునందు
శ్రీ శ్రీ శ్రీ మహర్షి మలయాళస్వాములవారి
యాజమాన్యమున జరిగిన శ్రీ సనాతన వేదాంతజ్ఞానసభా
అష్టావింశ వార్షికోత్సవ సందర్భమున
భక్తుల ఉపయోగార్థము
ప్రకటింపబడినది.


విజయనామ సం॥
ఫాల్గుణశుద్ధ పౌర్ణమి
19-3-1954

ఓమ్
తత్సత్

శ్రీ శుకబ్రహ్మాశ్రమము
కాళహస్తి. (పోస్టు)
(చిత్తూరుజిల్లా)

Acc No 5746

# శ్రీ మహర్షి మళయాళస్వాములవారి సదుపదేశములు

1. నిర్మలమైన దైవభక్తియు, ప్రాణికోట్లసేవయు ఇహపరసౌఖ్యములకు మార్గము.

2. అంతఃకరణమునందలి వృత్తులు, సంకల్పములు, గుణములు, వాసనలు పూర్తిగా విలయము నొందువటులను, సాధనములందు జీవితమెల్ల వినియోగపఱచవలెను.

3. సాధనానుష్ఠానములద్వారా మనోజయమును సాధించినవాడే నిజమైన బలవంతుడు. మనోజయము లేనివాడెంత సింహబలుడైనను నిజముగ దుర్బలుడే.

4. మహత్తరమైన పుణ్యముచేతగాని మానవజన్మ లభించదు. అదియు బుద్బుదమువలె క్షణభంగురమే. దీనిని యెఱిగిన విజ్ఞులు కాలమును వృథాచేయరు. కాలముయొక్క విలువను గుర్తించి సదా పరమాత్మధ్యానములో గడుపుటయే మానవుని ముఖ్య ధర్మము.

5. నీటిలో పడవ యుండవచ్చునుగాని, పడవలో నీరు ఉండగూడదు. అట్లే సంసారములో నీవు ఉండవచ్చునుగాని నీలో సంసార ముండరాదు.

ఓమ్ తత్ సత్.

Acc.no: 5746

# మోక్షమార్గము

(శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు)

'స్వరాజ్యము మన జన్మహక్కు' అని తిలక్ మహాశయుడు ఎలుగెత్తి చాటిన విధమున 'స్వారాజ్యము (ఆత్మసామ్రాజ్యము, మోక్షము) మన జన్మహక్కు' అని ఋషులందరును ఉద్ఘోషించి యున్నారు. స్వరాజ్య, స్వారాజ్యములు రెండును జీవునకు ఆవశ్యకములే. బాహ్యమున పరరాజుల బానిసత్వము, అభ్యంతరమున ఇంద్రియ మనంబుల బానిసత్వము జీవుని ఆక్రమించి వేధించుచున్నవి. అతనిని అస్వతంత్రునిగ జేసి వైచుచున్నవి. కాని, భారతీయుల అకుంఠిత కార్యదీక్షచే స్వరాజ్య మెట్టకేలకు సంప్రాప్తించినది. అంతటితో తృప్తిపొంద రాదు. చేయవలసిన కార్యమింకను చాలకలదు. ఒక బానిసత్వము వదలినను, దానికి పదిరెట్లు బలవత్తరమైన మఱియొక బానిసత్వము తిష్ఠవేసికొని యున్నది. అది ఈ జన్మయందే కాదు. జన్మజన్మాంతరముల నుండియు జీవుని వెంటాడి బాధించుచున్నది. ఆ ప్రబల శత్రువును ఉన్మూలించినగాని పూర్ణ శాంతి సౌఖ్యములు జీవునకు కలుగనేరవు. శారీరికబాధ శమించినను మానసిక బాధకలవారికి శాంతియెచట? కాబట్టి ఇంద్రియ మనంబుల దాసత్వమునుండి విడివడిననాడే, కామక్రోధాదుల బారినుండి తప్పించుకొనిననాడే, ప్రకృతి పారతంత్ర్యమును పారద్రోలి, ఇంద్రియమనంబులపై నాధిపత్యము వహించి వానియొక్క దాస్యశృంఖలములనుండి విముక్తి నొందిననాడే పూర్ణస్వాతంత్ర్యమును బొందినవార మగుదుము.

ఈ సత్యమును మనస్సునం దిడుకొనియే శ్రీకృష్ణభగవానుడు కామాదిరూపమగు ఆ యాంతరంగిక ప్రబల శత్రువు నెట్లైన జయించియే తీరవలెనని అర్జునునకు శాసించెను.

'జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్.'

'ఓ అర్జునా! ఆ కామాదులు నీకు శత్రువులు! ముముక్షువులకు శత్రువులు! బహుజాగ్రత! నీ జ్ఞానమునంతను అవినాశనముచేసి నిన్నధోగతికి త్రోసివేయును. కావున వానిని ముందుగా జయించి వేయుము' - అని భగవంతుడు హెచ్చరిక చేసియున్నాడు. కావున ఓ ముముక్షువులారా! సాధకులారా! మనలో ఒక గొప్ప శత్రువు కలడు. లోకము లన్నిటిని మనము జయించినప్పటికిని ఆశత్రువునకు లొంగిపోయినచో మనము యథార్థమైన విజేతలము కానేరము. కాబట్టి ఈ విషయమై బహుజాగరూకులై వర్తింప వలయును.

ఆశాయా దాసా యే తే దాసాస్సర్వలోకస్య,
ఆశా దాసీ యేషాం తేషాం దాసాయతే లోకః.

అంతరంగ శత్రువగు ఆశకు దాసులైనవారు లోకమున కంతకు దాసులే యగుదురు. కాని ఆ ఆశ యెవరికి దాసియైయుండునో లోకమంతయు వారికి దాసానుదాసియే యగును.

ఆత్మస్వాతంత్ర్య సంపాదన మొనగూర్చునట్టి ఆ యభ్యంతర శత్రువిచ్ఛేదన మెట్లు సంభవించునో, ఆ యుపాయమును శ్రీ భగవానులే యిట్లు సెలవిచ్చియున్నారు.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా,
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్.

అనగా బుద్ధికంటెను ఆత్మ పరమైనట్టిదిగ తెలిసికొని, అట్టి తురీయాత్మయందు నిలుకడ కలిగి కామరూపమగు మహాశత్రు

వును జయించివేయుము.' సంపూర్ణమైన ఇంద్రియనిగ్రహము కలుగుటకు ఇది యొకటియే యుపాయము. వేదాంతముయొక్క కీలకమంతయు ఇచటనేయున్నది. ఇతరములగు చిన్న చిన్న సాధనములచేతను, ఉపాయములచేతను ఇంద్రియ మనంబుల నిగ్రహము కొంతవఱకుమాత్రమే సాధ్యమగునుగాని పూర్ణముగగాదు. అత్తఱి వాసన ఒకింత శేషించియేయుండును. పరమాత్మదర్శనము కలుగు నప్పుడు ఆ వాసన సంపూర్ణముగ నశించిపోవును. అయితే ఆ పరమాత్మ దర్శనమెట్లు కలుగును? - అనాత్మరూపములగు దేహేంద్రియ మనోబుద్ధ్యాదులు దృశ్యము కావున వానిని తొలగించి వైచి తత్సాక్షియగు ఆత్మయే తానని బాగుగా నిశ్చయించుకొనవలెను. తాను మనోబుద్ధీంద్రియములకు విలక్షణుడనియు, సాక్షియనియు బోధ యెప్పుడు దృఢముగ గలుగునో, అప్పుడు మనస్సు, ఇంద్రియములు లెస్సగ స్వాధీనము లగును. అప్పుడే జీవుడు మోక్షస్థితిని బడయగల్గును. ఇదియే వేదాంతముయొక్క సారము.

అత్తఱి తా నేకాలమందును జన్మించలేదనియు, మరణించలేదనియు, ఇంతదనుక ఈ మహానాటకమంతయు నాడుచున్నది చిత్తమనియు, అజ్ఞానవశమున తానే సుఖదుఃఖాదులను పొందుచున్నట్లు వ్యర్థముగ తలంచుచుంటిననియు, తా నెప్పటియట్లే పూర్వమున్న ఇపుడున్నగూడ స్వస్వరూపమున నిర్వికారుడై, చిత్తాదులకు సాక్షియై చెన్నొందుచున్నాడనియు తెలిసికొని నిరావరణజ్ఞానసంపన్నుడై బ్రహ్మానందమున నోలలాడుచుండును. ఆత్మానుభూతియొక్క మహిమ యిట్టిది. సమస్త శక్తులకును, బలములకును ఆధారము ఆత్మయే గనుక ఆత్మశక్తి భౌతికశక్తులన్నింటిని మించియున్నది. కనుకనే విశ్వామిత్రుడు—

"ధిక్ క్షాత్రబలం బ్రహ్మ తేజోబలం బలమ్"

అని వ్రాయుచ్చియున్నారు. ప్రతి ప్రాణియందును ఈ ఆత్మశక్తి అప్రతిహతముగ వెలయుచున్నప్పటికిని జీవుల అజ్ఞానవశమున నయ్యది యెఱుంగబడక నిద్రాణమై వర్తించుచున్నది. బ్రహ్మైక్యవిబోధముచే నద్దానిని మేలుకొలుపవలెను. అప్పుడు 'పంజరాదివ కేసరీ' యనునట్లు స్వాత్మసింహము ప్రకృతిశృంఖలములను భేదించుకొని స్వతంత్రస్వరూపమున వినిర్గతమగును. ఈరీతిగ జీవునకు స్వస్వరూప ప్రాప్తిద్వారా నిరతిశయానందమును సంప్రాప్తింపజేయునదియగుటచే బ్రహ్మవిద్యకు లోకములో నెంతయో ప్రాధాన్యత యొసంగబడినది. అట్టి నిరుపమగు ఆధ్యాత్మవిద్యను మన పూర్వికఋషులు అనేక త్యాగములు కావించి, కష్టముల కోర్చి, బహువిధసాధనల ననుష్ఠించి అనుభూతమొనర్చుకొని బోధించిరి. అమ్మహాసేయుల పాదరజముచే భారతావని పునీతమైనది. వారి దివ్య బోధామృతధారలచే సంసిక్తమై యుండుటచే నేటికినిగూడ భారతదేశము ప్రపంచమునకంతకును శాంతిసందేశము నివ్వగలుగుచున్నది.

అట్టి మహర్షులసంతతియందు జన్మించిన మనము, మనకు వారు సంపాదించి యిచ్చిన జ్ఞానధనమును పోగొట్టుకొనకుండ చూడవలెను. అప్పుడే భారతదేశము చిరకాలమునుండియు సముపార్జించుచు వచ్చిన అధ్యాత్మప్రతిష్ఠను మనము కాపాడినవారమగుదుము.

"India is immortal if she persists in her search for God" అని వివేకానందులు చెప్పినట్లు, తన భగవదన్వేషణకార్యమును విడువకయున్నచో హిందూదేశము చిరస్థాయియై శాశ్వతకీర్తిని బడయగలదు. లేకున్న పతనమైపోవును.

కావున ఋషులు పొందిన పరమసత్యమును, ఆత్మసాక్షాత్కారరూపమహోన్నతలక్ష్యమును సర్వులును ప్రయత్నపూర్వకముగ తప్పక సంపాదించవలెను. 'మనము పాపులము కాము, పుణ్యాత్ములము, సచ్చిదానందస్వరూపులము' అను భావము రూఢిపడవలయును. 'నేను అజ్ఞానిని, పాపిని, అల్పుడను, దుర్బలుడను, నీచుడను' అని యెంతకాలము జీవుడు తలంచుకొనుచుండునో, అంతవఱకాతనికి వృద్ధి యెచట? 'నేను దేహమునుకాను, మనస్సునుకాను, కేవలఆత్మరూపుడను, పరబ్రహ్మస్వరూపుడను' అని అనవరతము చింతించుచుండుటవలననే అఖండధైర్యము, నిర్భయత్వము కలుగును. వివేకానందుల ఈ క్రింది గంభీర వాక్యముల నాలకింపుడు—

"Ye, divinities on earth! — sinners! It is a sin to call a man so; it is a standing libel on human nature. Come up, O lions and shake off the delusion that you are sheep. You are souls immortal, spirits free, blest and eternal; Ye are not matter. Ye are not bodies; matter is your servant, not you the servant of matter.........

"It is strength and strength that we want and the first step in getting the strength is to uphold the Upanishads and believe that I am the Atman."

అనగా "అవనిపై మూర్తీభవించిన ఓ దివ్యాత్మస్వరూపులారా! మీరు పాపులా! రామరామ! మనుజుని ఆ ప్రకారము అనుటయే పాపము. ఆ ప్రకారము మనుజుని పాపి యనుట మానవత్వముపైననే కళంకమాపాదించునట్లు. ఓ సింహములారా! లెండు, మీరు గొఱ్ఱెపిల్లలను భ్రమను పారద్రోలుడు. శాశ్వతమై, స్వతంత్రమై, ఆనందరూపమైనట్టి ఆత్మయే మీరు. మీరు దృశ్య

పదార్థము కారు, దేహము కారు; ప్రకృతి మీయొక్క దాసి. మీరు ప్రకృతికి దాసులు కారు......

'మనకు కావలసినది బలము, బలము! అట్టి బల సంపాదనమునకై వలసిన ప్రప్రథమకార్యము ఉపనిషత్తులను విశ్వసించి (ప్రోత్సహించి) 'నేను ఆత్మను' అని తలంచుటయే.'

వివేకానందుల ముఖమునుండి వెల్లివిరిసిన ఈ గంభీర నిస్వనము ముముక్షువుల కెల్లరకు తప్పక ధైర్యోత్సాహముల గలుగజేయుననియు, వారి ఆధ్యాత్మికసాధనల యొక్క తీవ్రతను ఇనుమడింపజేయగలదనియు తలంచుచున్నాను. అయితే, మనుజుడు తాను నిత్యశుద్ధమగుఆత్మయని ఒకప్రక్క తలంచుచు, మఱియొక ప్రక్క అసురత్వమునకు, పాపాచరణమునకు చోటీయకుండ చూడవలెను. అట్లుకాక 'అంతయు బ్రహ్మమే, నేనూ బ్రహ్మమునే' అని చెప్పి యథేష్టాచరణమునకు గడంగగూడదు. అట్లు చేసినచో అది శుష్కవేదాంతము, మెట్టవేదాంతము అగునేగాని పరమార్థానుభవము కానేరదు. ఇవ్విషయమున సాధకులందరు బహుజాగరూకులై మెలంగవలెను. తమచరిత్రయందు, ఆచరణయందు ఏమాత్రము కళంకము రానీయకుండ జాగ్రతగ పరిశీలించుకొనుచుండవలెను. లేకున్న తమ సంప్రదాయమునకు, తమ మతమునకు, తమ దేశమునకు గూడ అప్రతిష్ఠ తెచ్చినవారగుదురు.

ఋషులు, మహాత్ములు బోధించినట్టి పైనదెల్పిన మోక్షరూపమగు పరమలక్ష్యమును, ఆత్మానుభూతిని ఈ జన్మయందే, ఇపుడే సాధించివేయుట ఉత్తమము. ఏలయనగా, ఇట్టి సదవకాశములు మఱుజన్మయందు — కాదు కాదు — మఱుక్షణమందును లభించునో లేవో చెప్పజాలము. మానవజన్మ యను అమూల్య

పెన్నిధి మనకు లభించినది. జంతువులమై పుట్టినచో మన గతి యేమైయుండెడిది? అనేకజన్మల పూజాఫలము ఒకచోట జేరి మనకీ జన్మను తెచ్చిపెట్టినది. సంసారసముద్రమును దాటుటకు చక్కటి నావవంటి ఈ శరీరమును బొంది, అది శిథిలము కాకపూర్వమే ఆవలియొడ్డుకు జేరిపోవలెను. మోక్షమునకు సోపానభూతమైనట్టి ఈ మనుష్యదేహమును బొందియు ఎవరు భగవద్విషయమై యత్నింపరో అట్టివారు ఆత్మహంతకులే యగుదురు.

ఈ ప్రపంచమున సమస్త పదార్థములు అనిత్యములు; శాశ్వతసుఖమును గలుగజేయఁజాలు పదార్థ మొకటేని ఈదృశ్య వర్గమునందు కలదా? లేదు. భోగములా, ఆరంభమున సుఖప్రద ములుగ దోచి తుదకు మహాదుఃఖదాయకములుగ పరిణమించు చున్నవి. సంపదలు మెఱుపుతీగవలె చంచలములై యున్నవి. బంధు మిత్రులా, కళ్లార నశించిపోవుచున్నారు. ఈ మన దేహమున్ను నేడో, రేపో, ఎన్నడో రాలిపోనున్నది. గొప్పగొప్ప రాజులు, చక్రవర్తులు భూతలమునంతను ఏకచ్ఛత్రాధిపత్యముగనేలిన అఖండ మహిమాన్వితులు, వీరులు, బలాఢ్యులుకూడ నామరూపములు లేక నశించిపోయిరి. ఇక మనమా శాశ్వతము? గొప్పగొప్ప బ్రహ్మాండములు, సృష్టిసమూహములు, లోకములుకూడ కాల గర్భమున విశీర్ణములై పోయినవి. ఇక యీ గృహారామ వనితా క్షేత్రాదులా స్థిరములు? ఆయువు తరగిపోవుచున్నది. కాలచక్రము రివ్వున తిరిగిపోవుచున్నది. నిమిషములు గంటలుగా మారిపోవు చున్నవి. గంటలు రోజులుగను, రోజులు సంవత్సరములుగను మారి జీవితమును ఆనాటికి దిగమ్రింగివేయుచున్నవి. చిల్లిపడిన కుండయందలి నీటివలె ఆయువు దినదినము సంక్షయమై పోవు చున్నది. మృత్యువు జీవుని కబళించివేయుటకు సిద్ధముగనున్నది.

కావున రేపు జేయవలసిన పనిని ఈ దినమే చేయవలెను. అంత్య కాలమున ఏది (పుణ్యము, దైవభక్తి, ఆత్మజ్ఞానము) ఉపకరించునో, దానిని ఇప్పుడే సంపాదింపవలెను. ఈధనముగాని, ఈ బంధువులుగాని, ఈ సంపదలుగాని, ఈ రూప యౌవన సౌందర్యాదులుగాని, ఈ ప్రాపంచిక యశస్సుగాని అవసానకాలమున ఏమైన అక్కఱకు వచ్చునా ?

'సర్వం వ్యర్థం మరణసమయే సాంబ ఏకస్సహాయః.'

అని శ్రీశంకరాచార్యులు నుడివినట్లు అంత్యకాలమున భగవంతుడొకడు తప్ప మఱేదియును అక్కఱకురాదు. మఱియు,

'జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్.'

అని శ్రీకృష్ణపరమాత్మ ఆనతిచ్చిన విధమున వైరాగ్య ప్రాదుర్భావమునకై ఈ రీతిగ జన్మ, మరణ, వార్ధక్య, రోగాదులవలన కలుగు దుఃఖములను, దోషములను మనుజుడు తప్పక విచారించవలెను. శబ్దాది విషయభోగములు దుఃఖమే మూలముగా గలవి. వానితో జీవుడు ఎంతెంత సంబంధమును గలుగజేసికొనుచుండునో, అంతంత తీవ్రముగ దుఃఖములను మేకులు ఆతని హృదయమున గొట్టబడుచుండును. కాబట్టి మోక్షమందపేక్ష కలదేని మొట్టమొదట విషయములను, కోరికలను విషమువలె దూరముగ త్యజించివేయవలెను. కావుననే బుద్ధదేవుడు రాజకుమారుడై విలసిల్లినను, సమస్త భోగభాగ్యములతో తులతూగుచున్నను క్షణకాలములో వానినన్నింటిని త్యజించివైచి తీవ్ర సాధనచే నిర్వాణము (మోక్షము) నకు మార్గమును కనుగొనెను. అట్లే భగీరథుడు, భర్తృహరి మొదలైన రాజులున్ను సర్వ ప్రాపంచిక సౌఖ్యముల ననుభవించి, కడకు వానియందు వాస్తవ సుఖములేదని నిశ్చయించి, ఆత్మశాంతికై తపనపడి, తుదకు

వానిని వదలివైచి వైరాగ్యపరులై బ్రహ్మధ్యానమున పరమా నందము ననుభవించిరి. ఈ ప్రకారముగ ఎందరో మహనీయులు దృశ్యసౌఖ్యములను బాగుగ పరీక్షించి పరీక్షించి తుదకు అవి సారహీనములని త్రోసివైచిరి. ఒకవేళ అనుభవించినను వాని యందు ఎప్పటికైన తృప్తికలుగునా యనిన, అదియునులేదు. పైపెచ్చు అనుభవించినకొలది (నేయిపోసిన నిప్పువలె) కోరికలు పెరుగునేకాని తరగవు.

న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి,
హవిషా కృష్ణవర్త్మేవ భూయఏవాభివర్ధతే.

అను యయాతి వాక్యమే ఇందులకు తార్కాణము.

నీటిలో ముంచబడినవాడు ప్రాణవాయువునకై యెట్లు తల్లడిల్లునో, నిప్పుకణిక శిరస్సుపై బెట్టబడినవాడు తాపమును సహింపజాలక, దానిని తొలగింప నెంత యాతురత జూపునో, మండువేసవి మధ్యాహ్నకాలమున సలసలకాగుచున్న ఇసుకపై పడవేయబడిన చేప శీతలోదక సంగమునకై యెట్లు వేగిరపడు చుండునో, గృహము జాజ్వల్యమానముగ దహింపబడుచుండ, లోనున్న వ్యక్తి బయటకు వచ్చుటకై యెట్లు తహతహలాడు చుండునో, తీవ్ర వైరాగ్యముగల ముముక్షువున్ను ఈ సంసార జంజాటములోనుండి తప్పించుకొని యెప్పుడు బయటబడుదుమా యని తల్లడిల్లుచుండును. సంసారనిదాఘనిపీడితుడై ఆత్మానంద మను శీతల జాహ్నవీతోయమున నెప్పుడు క్రుంకు లిడుదుమా యని యువ్విళ్లూరుచుండును. వైరాగ్యమున ఇంత తీవ్రత్వము లేనిచో ఆత్మజ్ఞానము కలుగదు; కలిగినను నిలువదు.

తీవ్ర వైరాగ్యముచే ఇంద్రియములు శబ్దాదివిషయము లందు ప్రవర్తింపక యుండును. అట్టి ఇంద్రియ సంయమముచే

మనస్సు స్వాధీనపడును. మనోనిరోధముచే ఆత్మయొక్క ఆవరణము తొలగిపోవును. అత్తఱి జీవుడు తన యథార్థస్వస్వరూపమున నిలుకడ కలిగియుండును. అదియే మోక్షము. కావుననే ఉపనిషత్తు లీ క్రిందివిధమున నుద్ఘోషించుచున్నవి.

యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృదిశ్రితాః
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే.

— కఠోపనిషత్తు.

అనగా హృదయమున నున్నట్టి కోరికలు, సంకల్పములు, దృశ్య వాసనలు అన్నియు తొలగగా మనుజుడు జననమరణ రహితుడై ఇచ్చోటనే పరబ్రహ్మము (మోక్షము) ను బొందుచున్నాడు.

ఈ ప్రకారముగ ముముక్షువగువాడు విషయవిరక్తి కలిగి నిజగృహమందుగాని, లేక పుణ్యాశ్రమములందుగాని ధ్యానము, బ్రహ్మచింతన, ఇంద్రియనిగ్రహము మొదలగునవి అభ్యసించుచు సద్గురువులయొద్ద, అనుభవజ్ఞులగు మహాత్ములయొద్ద అనుష్ఠాన పద్ధతులను నేర్చుకొని క్రమముగ ధ్యేయాకారమందు (ఆత్మయందు) నిలుకడ బొందవలెను. ఇందులకై సోమరితనమును వీడి నిరంతరము పరిశ్రమ చేయవలసియున్నది. అధ్యాత్మరంగమున తగిన శిక్షణ పొందవలెను. ప్రాపంచికకార్యసాధనలకై జనులు ఎంత ఓపిక, ప్రీతి, ఏకాగ్రత ప్రదర్శించుచున్నారో, అట్టిదానిని దైవకార్యములందు జూపినచో ఎప్పుడో మోక్షమును బొంది యుండెడివారు. పూర్వపు దుస్సంస్కారములు, దుర్వాసనలు అంతరించి చిత్తము దైవమయమై, తేజోవంతమై చెన్నొందవలెను. దోషయుక్తములగు అణువులన్నియునశించి మనస్సు విశుద్ధసత్త్వమున ప్రతిష్ఠితము కావలెను. రాగి బంగారుకావలెనన్న,

లేక రాయి విగ్రహము కావలెనన్న ఎంతయో కృషి, పరిశ్రమ ఆవశ్యకమైయున్నట్లు జీవుడు శివుడుకావలెనన్న అకుంఠిత దైవ విశ్వాసము, మహత్తర సాధన ఆవశ్యకమైయున్నవి. విద్యార్థులు పరీక్షలం దుత్తీర్ణులగుటకై రాత్రింబగళ్లు విరామము లేక ఎట్లు చదువుచుందురో, అట్లే ఆత్మవిద్యయందు త్తీర్ణుడగుటకై ముముక్షువు అనవరత జప, ధ్యాన, ఆత్మ విచారణాదులను గావింప వలెను. సాధకుడగు జీవుని పడగొట్టుటకై మాయ కాచుకొని యున్నది. కావున ఆ మాయను పడగొట్టుటకై జీవుడు భక్తి జ్ఞాన వైరాగ్యాది ఆయుధములతో సన్నద్ధుడై యుండవలెను.

అయితే మనము చేయు జప తప సంకీర్తనాదులచే మన యంతఃకరణము పూర్వముకంటె శుద్ధత్వమును బొందుచున్నదా లేదా యను విషయమును పరిశీలించుకొనుచుండవలెను. ఇన్ని గంటల ధ్యానము, ఇన్ని వేల జపము, ఇన్ని వత్సరముల తపస్సు — ఇవి అంతలెక్కలో చేరినవికావు. వాని ఫలితము తమకేమి కలిగినది—అని చూచుకొనవలెను. ఎంతకాలము చిత్తము అంతర్ముఖమై దైవచింతనయందో, సాక్షిస్వరూపమందో నిలుకడకలిగి దృశ్యవృత్తులు లేకయున్నది — ఇదియే ప్రతివారు పరీక్షించుకొనుచుండ వలసిన విషయము. ప్రారంభావస్థలలో మనస్సు సాక్షిస్వరూపమందు నిలుకడకలిగియుండుట సాధ్యముకాదు. కావున ఎంతవఱకు మనస్సు అంతర్ముఖమైయుండునో అంతవఱకు ధ్యానాదులందు కాలముగడపి తదుపరి ఏదైవకార్యమందో, ఉపనిషదాది ఉద్గ్రంథ పఠనమందో, గురుసేవయందో, పూజాసంకీర్తన భజనాదులందో, పరోపకార క్రియలందో అద్దానిని వినియోగించవలెను. అట్టిచో మనస్సు ఏకాలమందును మాలిన్యమునొందకయే యుండును,

ఈ రీతిగ శ్రద్ధాభక్తులతో సాధనచేయుచుండగా క్రమముగ అవిద్య సమసిపోవ ముముక్షువు తన యథార్థ (ఆత్మ) స్వరూపమును గుర్తెఱిగి తాను దేహాదిదృశ్యము కాననియు, నిత్యశుద్ధ చిదాత్మయేయనియు దృఢనిశ్చయము కలవాడై బ్రహ్మానందమున నోలలాడుచు జీవన్ముక్తుడై విలసిల్లును. అట్టి మహోన్నత స్థితిని, పరమలక్ష్యమును ఈ జీవితమందే సర్వులును సాధించి ధన్యులయ్యెదరుగాక! ఒకవేళ లక్ష్యప్రాప్తికిపూర్వమే సాధకునకు మరణము సంప్రాప్తమైనచో, అందు విచారపడవలసిన దేమియును లేదు. 'శుచీనాం శ్రీమతాం గేహే' అనునట్లు సుజనజన్మయందు ఉత్తమగర్భమున జనించి మిగిలిన సాధనను అతడు ప్రాప్తి చేసికొనును.

'నమే భక్తః ప్రణశ్యతి'
'నహి కల్యాణ కృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి'

అనగా 'నా భక్తుడెన్నటికిని చెడడు', 'సత్కార్య మాచరించు వానికి దుర్గతి ఎన్నటికిని కలుగదు' - అను నీప్రకారములగు భగవంతుని ప్రతిజ్ఞాపూర్వక వచనములను సంస్మరించుకొని అఖండ ధైర్యోత్సాహ సమన్వితులమై వెనుక చూపులేక ఆత్మమార్గమున ఇతోధికముగ యత్నించెదముగాక!

ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్య వరాన్నిబోధత!

మున్నగు ఉపనిషద్వాక్యములు— "అజ్ఞాన నిద్రనుండి మేల్కొనుడు! ఆత్మ విషయమున జాగరూకులై యుండుడు! మహనీయుల యొద్దకేగి ప్రబోధము నొందుడు!" అని జనులను హెచ్చరించుచున్నవి. వానినాలకించి దైవప్రోక్తములగు అట్టి వాక్యములపై అచంచల విశ్వాసముగలిగి తద్రీతి యనుష్ఠించుటకై యుపక్రమించెదము గాక! ఎప్పుడు మనము మన లక్ష్య

ప్రాప్తికై దృఢనిశ్చయులమై సర్వేశ్వరునియెడలను, సద్గురువు యెడలను అనుపమభక్తిగలిగి సాధన నుపక్రమించెదమో, అప్పుడిక ప్రపంచమునందలి ఏ శక్తియు ఆకార్యమునుండి మనలను నిరోధించుటకు సమర్థము కాజాలదు.

క్షణికములును, అశాశ్వతములును, పరమానందప్రాప్తి రహితములు నగు స్వల్పస్వప్న ప్రాపంచికలక్ష్యములకై జీవితములను ధారవోయుటకంటె శాశ్వతమై, ఇహపరశ్రేయోదాయకమై, సర్వోన్నతమై, నిత్యానందప్రదమైనట్టి బ్రహ్మాత్మైక్యరూప చరమ లక్ష్యమును సాధించుటకై ఏల యత్నము సలుపరాదు?

"Better to aim at a lion and miss it, rather than hunt a jackal and catch it." — అను నొక ఆంగ్లోక్తి కలదు. దాని యర్థమేమనిన, 'పరుగెత్తుచు వెంటాడి నక్కను బట్టుకొనుటకంటె, తప్పిపోయిననుసరే సింహమునే గురిపెట్టికొట్టుట మంచిది.' అట్లే చిన్న చిన్న సాంసారికలక్ష్యములను, పదవులను జీవితాంతము వఱకు పట్టుకొని వ్రేలాడుటకంటె పూర్ణశోకశాంతి, ఆనందప్రాప్తి గలుగజేయు భగవత్సాక్షాత్కారమునకై యత్నించుట మేలు.

కాని, బహుజన్మార్జితములగు ప్రాపంచికవాసనలు, సంస్కారములు జీవులలో ఘనీభవించి యుండుటచే ప్రారంభముననే ఆకార్యమున విజయము కలుగకపోవచ్చును. కొన్ని యాటంకములు విఘ్నములు కలుగవచ్చును. కాని ఎన్ని విఘ్నములు తటస్థించినను, ఎన్ని యిక్కట్లు దాపురించినను, ముందు పెట్టిన అడుగును వెనుకకు మరల్చరాదు. సాధనను ధైర్యముతో కొనసాగించుచునే యుండవలెను. సర్వేశ్వరునియెడల, సద్గురువు యెడల అనన్యభక్తిగలిగి యున్నచో విఘ్నములన్నియు పటాపంచలై పోవును. ప్రకృతిరూపమగు మాయ ఈశ్వరుని అధీనమై

యున్నది గావున,ఈమాయను జయించవలెనన్న మాయాధీశుడగు ఈశ్వరుని అనుగ్రహమును తప్పక పొందియే తీరవలెను. అదియో నిష్కామకర్మము, భక్తి మున్నగువానిచేతనే కలుగును. కాబట్టి హృదయపూర్వకముగ సర్వేశ్వరుని, సద్గురుని నిర్మలభక్తితో నారాధించుచు, వైరాగ్య వివేక విచారణాదులు కలవారై శ్రద్ధతో ఆధ్యాత్మికసాధనలను కొనసాగించినచో, అచిరకాలము లోనే ప్రతిబంధము లన్నియు పలాయనములై పోయి లక్ష్యము కరతలామలకముగ గోచరించును. అత్తఱి — దేనిచే జీవరాసు లన్నియు బంధింపబడినవై సత్యవస్తువు నెఱుగజాలకున్నవో, ఎయ్యది ఉన్నదానిని లేనిదిగను, లేనిదానిని ఉన్నదిగను కల్పించి ఈ జగన్నాటక మాడుచున్నదో అట్టి దురంతమగు మాయ క్షణకాలములో సాధకునకు లొంగిపోవును. అట్టిస్థితియే మోక్షము. అదియే స్వారాజ్యము.

స్వారాజ్యప్రాప్తికై భారతీయులు ఎన్నియో వత్సరములు అనేకయిడుములు బడవలసివచ్చెను. లాఠీదెబ్బలను, ఫిరంగిగుండ్లను సహింపవలసివచ్చెను. పెక్కుత్యాగములను గావింపవలసివచ్చెను. అట్టిచో నిక స్వారాజ్య (మోక్ష) రూపమగు బ్రహ్మత్వప్రాప్తికై ఎన్నికష్టముల నోర్వవలెనో, ఎంతసాహసము జూపవలెనో, ఎన్ని త్యాగములను జేయవలెనో యోచించుకొనుడు. ఒక చిన్న ఉద్యోగమును సంపాదింపవలెనన్నగాని, ఒకపరీక్ష ప్యాసుకావలెనన్నగాని రాత్రింబగళ్లు కృషిచేయుచున్నారుగదా! ఇక ఎద్దానియందు గంధర్వ, ఇంద్ర, బ్రహ్మదేవుల ఐశ్వర్యమున్ను, ఆనందమున్ను లవలేశములే అయియున్నవో, అట్టి బ్రహ్మసంపదవి నలంకరించుటకై ఒకింత శ్రమజేయుట కష్టమా?

మహాశయులారా! ఘోర తమస్సునందు కూలద్రోయు నాస్తికుల ప్రలాపములకు చెవియొగ్గక నిర్భీకులమై సత్యమార్గమున దైవమార్గమున జనెదముగాక! త్రోవలో దుఃఖములువచ్చునా? అవియన్నియు సుఖములే. అనంతానందపదవి నొందబోవుచుండ, మార్గమున తగులు శ్రమ శ్రమకాదు; శ్రేయమే యగును. ఇక భయము దేనికి? మృత్యువునకా? అది మనలను పిలువకమునుపే మనమే దానిని ఆహ్వానించుస్థితిలో బాగుగ తయారై యున్నచో ఇక నది మనల నేమిచేయగలదు? చేయవలసినపని (ఆత్మజ్ఞానసంపాదనము) పూర్తిఅయినచో, ఇక మృత్యువు వచ్చిననేమి? రాకున్న నేమి? అట్టి కృతకృత్యునకు మరణము మంగళమే యగును.

కాబట్టి నిర్భయచేతస్కులమై గమ్యస్థానమగు పరమాత్మను జేరువఱకు వెనుకకు మరలక, భక్తి జ్ఞాన వైరాగ్యాది సాధనసంపత్తితోగూడి ధైర్యోత్సాహముతో ఆత్మమార్గమున నధిగమించుచు, సర్వేశ్వరుని కృపచే ఈ జన్మయందే చరమలక్ష్యమగు మోక్షమును సంపాదించి ధన్యులమయ్యెదముగాక! తల్లి గర్భమునుండి ఏడ్పుతో ప్రారంభమైన ఈ జీవితము తుట్టతుదకు నవ్వుతో అంతమగుగాక!

"అహో௨స్మాకమలం మోహైరాత్మా బ్రహ్మేతి నిర్భయమ్"

— శ్రీ శంకరాచార్యులు

అనగా 'దేహేంద్రియ మనంబులకు సాక్షియై విలసిల్లు ఈ ప్రత్యగాత్మయే పరబ్రహ్మము — ఈ పరమసత్యమును తెలిసికొని నిర్భయులై యుండుడు!' అని యీ ప్రకారముగ మహాత్ములగు గురువులు, ఋషిసత్తములు మ్రోగించిన వేదాన్తడిండిమము —

అద్వైత జయభేరి అప్రతిహతనాదంబున మన కర్ణగోళంబులందు నిరంతరము ప్రతిధ్వనించుచు కర్తవ్యమునకై మనలను పురిగొల్పు గాక! ఆ దివ్యనిస్వనము దశదిశలు పిక్కటిల్లునట్లు ముఖరితమై ఎల్లెడల వ్యాపించి జనుల హృదయాంతరాళములను ఉత్తేజపరచి ఆత్మోన్ముఖమగునట్లు ఒనర్చుగాక!!

హరిః ఓం తత్ సత్.



294.5
U.P.
Acc No. 5446

0883 - 246 2565
903 246 2565

MOHAN PUBLICATIONS

# మోహన్ పబ్లికేషన్స్

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533101.

WWW.MOHANPUBLICATIONS.COM

## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

| | | |
|---|---|---|
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాధ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (ఖైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (ఖైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |

